చేసినదో పరీక్షించి నిదానము చూపుటలెస్స. పాశ్చాత్యదేశములందును సంయుక్తవిద్యావిధానము కావలయునను వారెంతమందియున్నారో వలదనువారు కూడ నంతమందియున్నారనియు, ఈవిషయమై ఏ ఒక్కదేశమునందును ఏకాభిప్రాయము లేదనియు తెలియుచున్నది."

## వెన్నెమ్మ:—

### శ్రీయుత వీరేశ్వర దీక్షితులుగారిట్లు వ్రాయుచున్నారు:—

"స్త్రీలు వెన్నెమ్మను ఎన్నెమ్మయని పిలుచుచున్నారు. దాని యదార్థనామము వెన్నెమ్మ అయినను, పదిదివముల పురుడుంగతించిన పిమ్మట దానిని స్మరింపని కారణముచే కాబోలు దానికలరూపును స్త్రీలేకాక విద్వాంసులగు పురుషులు సహితము గ్రహింపలేకయున్నారు. ఈవెన్నెమ్మయొక్క నిజతత్వము నెఱిగినచో స్త్రీలు దానినిగురించి భయపడవలసిన అవసరముండదు. పురుటింటిలో చెప్పు వెన్నెమ్మకథలో విశేషార్థమేమియులేదు. సోమయాజులకూతురు మాలవాని భార్యకథలో తల్లిదండ్రుల యభ్యాసముచే బిడ్డలకు సంక్రమించుననని తెలియుచున్నది. వెన్నెమ్మ పురుటింటిలో ఆరు, ఎనిమిది, పదియవరోజులలో తనశక్తిని విజృంభించుననియు, ఈరోజులలో శిశువునెత్తివణచుననియు, కాని తల్లి స్తన్యమిచ్చునపు డేమియుచేయజాలదనియు చెప్పుకొందురు. ఇట్టి మూఢవిశ్వాసమునందుకూడ కొంతవఱకు సత్యములేకపోలేదు. కాని దాని యదార్థమును తెలిసికొనుట మిక్కిలి యావశ్యకము. ఎన్నెమ్మయనగా వెన్నెమ్మయని ఇదివఱకే నుడివరింపబడినది. మనుజులకు బలీయస్థానము వెన్నెముకయుండుప్రదేశమే. వెన్నెముకగట్టిగను, వంకరలేకను ఉన్నచో వారి యారోగ్యముచెడదని చెప్పవచ్చును. పసిబాలుర వెన్ను మిక్కిలి కోమలముగనుండును. ఆవెన్నుపరము తెల్లనిద్రవపదార్థముగనుండి నడుమునుండి శిరస్సువఱకును ప్రవహించుచుండును. పసిబిడ్డలకు పుట్టినపిమ్మట రమారమి పదిరోజులకుగాని వెన్నెముకగట్టిపడి శిరోభాగముతో సంధింపదు. కారణాంతరమున అవి కలియకుండినచో బిడ్డలకు ప్రాణాపాయమువాటిల్లుటయుకూడ జరుగును. ఈవిధముగజరిగి బిడ్డలు మరణించినచో అది వెన్నెమ్మ సందుగొట్టినదని తల్లులు వాపోవుదురు. కావున తల్లులు తమపురిటిబిడ్డల నడుమును శిరస్సును ఎక్కువగ వంగకుండునట్లు పట్టుకొనవలయును. అందుకనియే తల్లి స్తన్యమిచ్చునపుడు వెన్నెమ్మ బాధయుండదు. ఏలయనగా ఆసమయమున బిడ్డయొక్క నడుమును శిరమును విశేషముగ కదలజాలవు. బాలింతరాండ్రు పైనిచెప్పబడిన విషయములనుగ్రహించి శిశువును జాగ్రత్తగపట్టుకొన్నచో వెన్నెమ్మపిశాచము వెనుకంజవేయగలదు. పురుటింటిలో దుర్గంధము, పొగ, గాలిలేమి ఇత్యాదికారణములచే జనించు చిన్నపురుగులను వెన్నెమ్మదూతలని భయపడుట కేవలమువెఱ్ఱితనము. వానిని చూచిభయపడి అకారణముగా చంపుటకేమని చెప్పవలయునో తెలియదు. దీనిని చదువువారైనను జీవహింసాఫలము మూటకట్టుకొనకుందురుగాక."

## శ్రీమతి నుసర్ల లక్ష్మీనరసమాంబగారికి:—

### శ్రీమతి పాకలరత్నమాలగారిట్లు వ్రాయుచున్నారు:—

"ఆంధ్రమహిళామణుల లోకమునవి అనుశీర్షికక్రింద శ్రీమతి నుసర్ల లక్ష్మీనరసమాంబగారు వ్రాసిన వ్యాసమును గృహలక్ష్మి పాఠకులందఱెఱింగియేయుందురు. అందు వరుడు తాగుబోతు, వికలాంగుడు, కుష్ఠు, క్షయ, గుడ్డి, కుంటి మొదలగు రోగములచే పీడింపబడువాడు తటస్థమగునపుడు భార్య తనభర్తనుండి విడాకును పొందవచ్చుననియు, రాబోవు గుంటూరు పంచమమహిళాసభయందు ప్యాసుచేసి విడాకులచట్టమునకు ప్రాణప్రతిష్టచేయవలసినదనియు వ్రాసియున్నారు. అంగవికలులును రోగులునయిన బీదవారిని పురు

లనుజూచి జాలిపడి వారికన్నోదకములనిచ్చి రక్షింపవలసిన మన మగ్నిసాక్షిగ బరిణయమాడినపతిని అనారోగ్యముగ నున్నప్పుడు, వికలాంగుఁడైనప్పుడు విడిచినచో వారలగతి యేమగునో కొంతవిచారింపవలసియున్నది. ఇప్పటికే పతిచే విడువఁబడివిచారించుచున్న సతీమణుల నెందఱనో మనముగాంచుచున్నారము. ఇఁక సతులచే విడువఁబడిన పతులగతికూడ నిట్లేయగుననుటకు సందియమేమి? అట్టి వికలాంగులు మరల పరిణయమాడవలెనన్న నెవ్వరంగీకరింపరుకదా? సంసారసాగరము దాటుటకు పురుషుఁడు నావయు, స్త్రీ తెడ్డుకఱ్ఱయు నైయున్నారు. అప్పుడు తెడ్డుకఱ్ఱ చేయిజారిన నావగతి యేమికాఁగలదో యాలోచింపవలదా? హిందూనారి కష్టసుఖముల సమముగా నెంచుకొనును. కష్టసుఖములు సమముగ ననుభవించుబాధ్యత సతీపతులలోఁగలదు. అట్టితఱి కష్టములున్నచోఁ గాపురమొనర్పవని సంసారమును విచ్ఛిన్నమొనర్చుట భావ్యము కాదు. పతి వికలాంగుడు, రోగిగానున్నప్పుడు సతి విడనాడుటమంచిదికాదు. అట్టి స్థితిలోవారిని వదలిన నిక వారలనిక రక్షకులెవ్వరు? కావున వారల కుపచారములొనర్చుచు మాత, సోదరి పగిదిరక్షింపసమకట్టవలెను. పురుషులుకూడ స్త్రీలవలె ఏకపత్నీవ్రతులై యుండుటయును, త్రాగుబోతు, జూదరి ఆయి నిష్కారణముగ సతీమణులను బాధించువారిని, విడిచిపెట్టువారిని శిక్షించుటకైన నొకచట్టమును నిర్మింపుడనికోరవలెనేగాని యీవిడాకులచట్టమునుకోరుట సమంజసముగాదు. ఇప్పట్టున సుమతీదేవిచరిత్ర నొక్కింత పరికింతుమేని కుష్ఠురోగియు వేశ్యాలోలుఁడునయిన పతినెట్లాదరించెనో మనకు విశదముకాఁగలదు. ఎన్ని విధములఁ బరికించిచూచినను విడాకులచట్టము యుక్తముకాదనినిరూపించుచున్నాను. కలకత్తానగరమున విద్యాప్రబోధముగల భారతస్త్రీలలో అగ్రగణ్యలగువారు సమావేశమై విడాకులతీర్మానమును త్రోసిపుచ్చుట గృహలక్ష్మి మనకువినిపించినది. వంగనారీమణులట్లే ఆంధ్రమహిళామణులెల్లరు పవిత్రభారతదేశమున నీచట్టమును ప్రవేశపెట్టకుండుటకు తీర్మానింతురుగాకయని విద్యాధికలగు సోదరీమణులను ప్రార్థించుచున్నాను. టర్కీదేశపు వివాహచట్టమును గూర్చి ఏప్రియల్ మాసపు గృహలక్ష్మి ప్రచురించియున్నది. అట్టి చట్టము మనదేశమునఁగూడఁబెట్టిన చాలమంచిది. అందు వివాహమునకు పూర్వము స్త్రీపురుషులను వైద్యులచే పరీక్షచేయించి ఆరోగ్యమగువారలు మాత్రమే వివాహమాడవచ్చునను పద్ధతి యెంతమంచిదో మనకు తెలియగలదు. అట్లు మున్ముందుజాగ్రత్తగా పరిశీలించి వివాహమాడుట శ్రేయస్కరముగాని వివాహానంతరము రోగులయినవారిని విడనాడుటుచితముకాజాలదని మదభిప్రాయము. విద్యాధికురాండ్రగు సోదరీమణులీవిషయమును శ్రద్ధతో గమనించుట లాభకరము. ఈవిషయమున తొందరపడుట మంచిదికాదనియు, భారతనారీమణుల పాతివ్రత్యమునకు భంగముకలుగకుండనుండవలెనని ఈచట్టమునకు ప్రాణప్రతిష్ఠచేయకుండుటే మేలనియు నాఅభిప్రాయమును వెల్లడించుచు తక్కుంగల సోదరీరత్నములను కూడ విడాకులచట్టమును కోరవలదనియు నిందుమూలముగా వినయముతో ప్రార్థించుచున్నదానను."

పై విషయమును గూర్చియే శ్రీయుత పూరె సత్యనారాయణగారిట్లు వ్రాయుచున్నారు:—

"ఈ మధ్యవెలువడిన గృహలక్ష్మి సంచికయందు శ్రీమతి నుసర్ల లక్ష్మీనరసమాంబగారు విడాకులచట్టావశ్యకతను గూర్చి వ్రాసినవ్యాసమును జదువనివారందఱును వెంటనే జదువదగును. ఆవ్యాసముసాంతముగ జదివినపిమ్మట ఆమె ప్రతిష్ఠింపఁగోరిన విడాకులచట్టమునందు గర్భితమైన విషయములు ఇంచుకదీర్ఘదృష్టిచే జూచినచో కేవలము నీతిదూరమై సనాతనధర్మనిర్మూలనకారణంబై హిందూసాంప్రదాయవిరుద్ధమై వధూవరులపురోవృద్ధికి ప్రబలనిరోధకమనుటకు సంశయములేదు. ఎట్లన: "వరుడు, త్రాగుబోతు, వికలాంగుడు, కుష్ఠు, గుడ్డి, కుంటిమొదలగు రోగములు కలవాడు తటస్థమగునపుడు....అట్టి వివాహమును రద్దుచేయవలసి

నది." "పురుషుడు అప్రయోజకుడై పోషించుకొలేని దుస్థితిలో నున్నప్పుడును, దీర్ఘరోగముచే పీడింపబడు చున్నప్పుడును, మతిభ్రష్టుడైనపుడును, సోమరిపోతుఅయి సాపాటురాముడుగానున్నప్పుడును, శిరోహీనంత రము అంగవికలుడైనను భార్య తనభర్తనుండి విడాకును పొందవచ్చును" అనుఅంశము ఆచట్టమునందుండ వలసినదట. ఇవి ఎంతదూరదృష్టిరహితవాక్యములో సోదరసోదరీమణులు విలోకింపుడు. మానవప్రపంచ మున నెట్టివాడును ఆజన్మాంతము నొకేతీరుగనుండగల్గునా? అయ్యది భగవదధీనముగాని మానవునిశక్తిలో నున్నదా? తొలుత విద్యాధనరూపబలసంపదల నలరారునట్టి యౌవనుడు కాలపరిణామమున జాడ్యగ్రస్తుడైనచో నట్టి భర్త త్యాజ్యుడేగదా? ఇకవానిగతియేమి? విధివశమున నైశ్వర్యలోపముగల్గి అనుట కన్నములేని దీనదశ కలుగగనే భార్యనుగూడ గోల్పోవలసినదేనా? కాలవశమున మతిభ్రష్టుడైనచో భార్యనువీడి వాల్తేరు చేర వలసినదేగదా? కర్మముచాలక కారునుండి క్రిందపడి కాలువిరిగినచో కారులోపి కారుదిరిగినకాంతగూడ కాలు విరిగినభర్తను వదలి కర్రజేతకీయవలసినదేనా? ఆహా! కాలమహిమ. అట్లయిన వీరికిగలిగిన సంతానము మాట చట్టమునందెక్కడను ఇరికించియుండలేదే? వారిగతియేమి? భర్తతో విడచిపోవలెనా, భార్య తానుగూడ నుండగోరవలెనా? అన్నట్లడుగమరచితిని వివాహవిమోచనానంతరము ఆయమ స్వేచ్ఛావిహారిణియేనా? ద్వితీయ లకస్వయంవరము కూడనున్నదా? అదికూడనుండిననేగాని ఆచట్టమునలవ ప్రయోజనముండజాలదు. మరియొక్క మాట. ఈచట్టము పురుషులకన్వయించునదేగాని స్త్రీలపట్లనుపయోగించినచో కడుచిక్కులుగల్గునని కాబోలు వధువునుగూర్చి యెచ్చటను వ్రాసియుండలేదు. ఏమన వివాహానంతరము భార్య కురూపిణియైనను, గుడ్డిదైనను, కుంటిదైనను, దీర్ఘరోగియైనను భరణముమాటదలంపకుండ బంపివేయవలసినదేగదా? ఇక నామె గతియేమి? సోమరిపోతుఅయి సాపాటురాముడుగానున్న వరుడును, పనిపాటలు చేయజాలక పందయయితూర్పుండు వధువును నొకరాశిలోనివారేకదా? ఈచట్టముభయతారకముగ నుండగోరినచో బాగుగనుండునని కొందరు పురుషులు దలంతురేమోగాని హిందూలాసంస్కరింపబడి స్త్రీలకుగూడ పుట్టినింట భాగ్యోదయమైన తరువాత నిట్టిచట్టము వచ్చినను స్త్రీలకంతచిక్కులుండజాలవుగాని లేకున్న వారికిమాత్రము మరింతకష్టమనిపించును."

**అతివిషాదకరమగు మరణము:—**

క్రిందిపంక్తులు మే 25-వ తేదీనాటి 'ధర్మసాధని'నుండి గ్రహింపబడినవి:—

"కాకినాడలోని పిఠాపురము మహారాజుగారి అనాథశరణాలయమునకు చాలకాలము సూపరింటెంటుగా నుండి ప్రస్తుతము కాకినాడలో విశ్రాంతి ననుభవించుచున్న శ్రీయుత వి. పెదంబరాజుగారి ధర్మపత్ని యీనెల ౨౧-వ తేదీని కాకినాడలో పరలోకగతురాలయ్యెనని తెలియజేయుటకు మేము మిక్కిలి చింతిల్లుచున్నాము. భర్త బ్రాహ్మధర్మానుష్ఠానమునకు పూనుకొన్నపుడేమి, ప్రభుత్వోద్యోగమును వదలి అనాథశరణాలయమున పనిచేయుటకు సంకల్పించినపుడేమి ఆయన యభీష్టమునకు కాదనక, ఆయనతో బాటు ధర్మనిర్వహణమునందు పలువిధములయిన కడగండ్ల ననుభవించి తన ధర్మపత్నీత్వమును సంపూర్ణముగా చెల్లించుకొన్న పరమసాధ్వీమణి. ఆమె తనసొంతబిడ్డలనేగాక నిస్సహాయులై తమగృహమున జేరిన సమీపబంధువుల బిడ్డలనుగూడ పరమాదరముతో పోషించి పెద్దవారినిజేసిన దయార్ద్రహృదయ. ఆమె మిను వన్నమాట యెఱుంగక, తమపెద్ద కుటుంబమును నెంతయు ఓపికతో చక్కగా నిర్వహించుకొనుచువచ్చిన నిపుణురాలు. ఆమె కొన్నిమాసములనుండి అతిబాధకరమైన జాడ్యముచే పీడితురాలై శయ్యనుండి లేవలేని స్థితిలో నుండెను. పడుచున్న కష్టమునుచూడజాలక పరమదయామయుడగు భగవంతు డామెను జీర్ణమయిన భౌతికశరీర గృహము నుండి తప్పించి తీసికొని వెళ్ళెను. అయిదుగురు కుమాళ్ళను, ముగ్గురు కుమార్తెలను, వృద్ధుడగు భర్తను, అతివృద్ధురాలగు తల్లిని తన వియోగమునకై విలపించుటకై భూమిపై విడిచి ఆమె దివంగతురాలయ్యెను.

దుఃఖాంబుధిలో మునిగియున్న ఆమె భర్తకును, సంతానమునకును, తల్లికిని, తక్కిన ఆప్తబంధువర్గమునకును మాహృదయపూర్వకసానుభూతిని వెల్లడించుచున్నాము. భగవంతుడు డాక్టరు ఆమెకు చిరశాంతి ననుగ్రహించుగాక!"

**చూలింతతనము : దంతములు:—**

ఏప్రియలుమాసపు 'Longevity' పత్రిక ఇట్లు ప్రకటించుచున్నది:—

"చూలింతతనమున దంతముల ఆరోగ్యము చెడుటయు, వాని వైద్యమునకు ధనవ్యయము కొంచము హెచ్చగుటయు సర్వసాధారణము. కొంచము జాగ్రత్తతో ఇట్టిదికలుగకుండ చేసికొనవచ్చును. ఉమ్మనీరు పులుపుగయుక్కుటచేతనే చూలాలితనమున దంతములు చెడుచున్నవి. చూలాలితనమున ఎప్పుడైనను ఎట్టిసందేహమును లేక దంతవైద్యము చేయించుకొనవచ్చును. తల్లి తగిన జాగ్రత్త తీసికొనుచో బిడ్డకు చక్కని దంతములు వచ్చునట్లు చేయవచ్చును. క్షారవస్తువులతో చేయబడిన ద్రవముతో తఱుచు గండూషించుటయు, చూలింత తనమున అంతము కాల్షియము తీసికొనుటయు విధికృత్యముగా స్త్రీలు గ్రహింపవలయును."

**నారింజపండ్లు:—**

'రవి'పత్రికనుండి నారింజపండ్లను గూర్చిన క్రిందివిషయములు జూనుమాసపు 'ప్రకృతిపత్రిక' ఉద్ధరించినది:—

"నారింజపండ్లయందలి ఆహారపువిలువను ఇప్పుడిప్పుడే గ్రహించి ప్రజలు విశేషముగ వీనిని వాడుచున్నారు. నారింజపండ్ల రసమునందలి పంచదార చాలబలము కలిగించును. శీఘ్రముగ అరిగి రక్తమునందు కలిసి వంటబట్టును. దానిలో కొంచెము ప్రొటీనుకూడ నున్నది. అది కండరములను పెంచును. ఖనిజసంబంధములైన ఉప్పులుకూడ నందున్నవి. అదిగాక పులుపుకలదు. మాంసము, బియ్యము, గోధుమలు, బంగాళదుంపలు, రొట్టెలు, పంచదారలందు ఇట్లు ఉప్పులు లేనందున నారింజలు చాల శ్రేష్ఠము. నారింజలు అజీర్తిని పోగొట్టును. పులితేనుపులను మాన్పించుటయందు అది చాల తోడ్పడును. నారింజపండ్లరసమునందు విటమినులు ఎక్కువగ కలవు. పాలలోలేని విటమినులలోపమును యిది తీర్చి పిల్లలకిచ్చిన వారు బాగుగ పెరుగుటకు చాల తోడ్పడును."

**కల్లుఇజారాదార్లలో స్త్రీలు:—**

Health and Happiness పత్రిక ఇట్లు ప్రచురించుచున్నది:—

"మార్చి 18-వ తేదీని వంగశాసనసభలో శ్రీ ఆర్. మెయిటీగారు మిడ్నపూరుజిల్లాలో కొన్నితావులయందు కల్లుసారాయిదుకాణములఇజారా స్త్రీల కీయబడుచున్న విషయమును వెల్లడించిరి. ప్రభుత్వమువారి కల్లుసారాయిఇజారాపద్ధతి ఇంతవఱకు ఒక్కపురుషుల నైతికజీవితమునే ఎక్కువగా భ్రష్టమొనర్చుచున్నది. ఇక స్త్రీలకుకూడ నిందుప్రవేశముకలుగుచో చెప్పవలసినదేమున్నది? శ్రీ ఆర్. మెయిటీగారి విషయమై తీవ్రమైన ఆందోళనము వడుపుదురుగాక యనికోరెదము."

**అరవవారి బాలికాపాఠశాలలదుస్థితి:—**

మేమాసపు The Indian Educator అను పత్రికలో టి. ఆర్. రంగస్వామిఅయ్యంగారు యం. ఏ; యల్. టి 'The Present State of Education' అనువిషయమునుగూర్చి వ్రాయుచు క్రిందివిచిత్రవిషయమును వెల్లడించినారు:—

"స్త్రీవిద్య ప్రముఖస్థానమునకు వచ్చుచున్నది. దానిప్రచారమునకు విపులప్రయత్నములును సాగుచున్నవి. కాని మర్యాదకుటుంబములోని బాలికలుపోయి విద్యాసముపార్జనముగావించుకొనగల ఉత్తమ పాఠశాలలు ఇంకను ఏర్పడవలసియున్నవి. ఒకానొక అరవఉపాధ్యాయిని సంగీతపాఠమప్పుడు తన బాలికలకు

ఒక తెనుగుకీర్తన చెప్పుచుండెను. ఆకీర్తన శృంగారరసభూయిష్టము. గ్రామాంతరస్థుడైన నాయకునిగూర్చి నాయిక గానించు విలాపగీతమది. నేనీసంగతి ఉపాధ్యాయిని నడిగితిని. ఆమె తెల్లబోయినది. తనకావిషయము తెలియదని చెప్పినది. ఇట్టి వికృతములు తొలగిపోయి పాఠశాలలోని వాతావరణము పవిత్రవంతము కానిదే ఏహైందవమాతయు తనబాలికను పాఠశాలకు పంపుటకు అంగీకరించదు."

సంగీతముకొఱకు ఆంధ్రభాష నవలంబించవలసిన అరవలస్థితి ఎంతహాస్యాస్పదముగ నున్నదో! భావముతెలియకపోయినను, అర్థముకాకపోయినను అరవలు సంగీతముకొఱకు తమకానటబీసటభాషనువదలి తెనుగు నాశ్రయింపవలసిన వారగుచున్నారు. తనగీతి అరవజాతిని పాఠకులనుగా దిద్దితీర్చుచున్నది తెనుగువాణి.

## గృహిణీగృహస్థులకు హితము:—

శ్రీయుత భోయనపల్లి లక్ష్మణరావు, ఎం.ఎస్.సి. గారిట్లు వ్రాయుచున్నారు:—

"ఆంధ్రనారీరత్నములకు మిక్కిలి ప్రియమైన "గృహలక్ష్మి" పంచికలయందు విడాకులచట్టమును గుఱించి అనేకులనేకవిధముల తమతమ యభిప్రాయముల బ్రకటించిరి. ఈచట్టము మనదేశమునకు క్రొత్తదని చెప్పుటకేమియును సందేహములేదు. పశ్చిమదేశములందీచట్టము మిక్కిలి ప్రబలమైయున్నది. అమెరికాదేశములోని స్త్రీలందఱును, ఈనియమము మితిమీరినదనియు, అసంభావ్యమనియుదలచి యేవిధముచేనైనను దీనిని దొలగింపవలయునని ప్రయత్నించుచున్నారు. న్యూయార్క్ (New York) పట్టణమున నలువది యేండ్లనుండి బీదవారలకు కోర్టుసంబంధమైన వ్యవహారములలో ధర్మార్థముగా సహాయముజేయుసంఘమువారు (Legal Aid Society of New York) వేలకొలది భార్యాభర్తలపరస్పరమనస్తాపములను, వాదములను, నితరవివాహసంబంధమైన దుర్దశాకరములైన నిజస్థితులను దెలిపినవారై, సంసారసుఖములను వృద్ధిజేయుటకు భార్యాభర్తలకై కొన్ని నడతలను నియమించియున్నారు.

### గృహస్థనియమములు

(1) నీసంపాదనననుసరించి యుదారత్వమును జూపుము. ఇవ్వగలిగినస్థితిలోనుండిన నీభార్యనిన్ను సొమ్మడుగును. భర్తనడుగక మఱెవ్వరినడుగగలదు? (2) గృహకార్యములు నడుపుటయందు నీవు ప్రవేశింపకుము. ఉన్నంతలో సమాళించుకొనుటకు మగవారికన్న స్త్రీజాతికి మిక్కిలిచాతుర్యముగలదు. (3) ఎల్లప్పుడును సంతోషముగనుండుము. ఇంటికొఱకు పాటుపడుచున్నయిల్లాలు మనోవ్యాకులముగల మానవశీలుడైన భర్తనుజూచి మనస్సునందు వ్యాకులమునెందును. (4) తొందరపడక విచారింపుము. ఆమెకారణము లేక ఫిర్యాదుచేయదు. ఇల్లు శుభ్రముగను, రమ్యముగను, సుఖకరముగనుఉండుటకై నీవు సహాయము చేయవలయును. (5) భార్యపై నెడతెగని ప్రేమకలిగియుండవలెను. ఉపేక్షించినచో ఆమె నుత్సాహములేక అలక్ష్యముచేయును. (6) స్వల్పమైన తప్పులకై తీక్ష్ణమైనపదములను ప్రయోగించిన ప్రేమతగ్గును. మఱియు నవి మనస్తాపములకు గారణమగును. తిరుగబడువాడుకమూడగలుగును. (7) సంసారము మీబంధువులకు దూరముగనుండునట్లేర్పాటుచేసికొనుము. భార్యాభర్తలకు మనస్తాపములు కలిగిన వారికివారే కొంతకాలమునకు సమకూర్చుకొనెదరు. ఎంతదగ్గరబంధువులైనను మాటిమాటికి సలహాలుపుచ్చుకొనిన నొకానొకప్పుడైనను కీడుకలుగును. (8) అద్దెకు మఱియొకనిని కాపురముంచుకొనకుము. వేఱొకపురుషుడింటనుండుట యనుమానమును, అపనమ్మకమును కలుగజేయును. స్త్రీ మానవజాతియేగనుక అపురుషునిశక్తికిలోబడుటయసంభవముకాదు. అట్లుచేసినచో ఆతప్పునీదియగును. (9) నిర్మలమైన దేహమును, పరిశుభ్రమైన వేషమునుగల భర్తనుజూచి భార్యకు గర్వమును, మెప్పును, గౌరవమును గలుగును. లేనిచో అసహ్యమగును. (10) నీబిడ్డలపై కనికరముచూపుము. స్త్రీ తనబిడ్డలపై క్రౌర్యమునుజూపువానిని నమ్మదు.

## గృహిణీనియమములు

(1) మిక్కిలి దుబారాచేయకుము. యుక్తమైనవ్యయము జాగ్రత్తతోడ చేసినయెడల భర్త మఱింత సంపాదించికూడబెట్టుటకు నుత్సాహియగును. వానికి స్వతంత్రతసంపాదించుటయందు సహాయురాలవగుదువు. (2) నీగృహమును శుభ్రముగనుంచియుండుము. అలసివచ్చిన భర్త కనులకు విసుగుదీర్పుదృశ్యము చక్కగ నుంచిన స్వగృహముగాని వేరొకటికాదు. (3) నీదేహమును, రూపమును ఎల్లప్పుడును మనోహరముగా భర్తనాకర్షించునట్లు నలంకరించుకొనియుండుము. పరిశుభ్రతలేని భార్య భర్తను ముఖముత్రిప్పుకొని బయట తిరిగెడువానిగాజేయును. (4) పరపురుషులపై శ్రద్ధను, ధ్యానమును నంగీకరింపకుము. పురుషులు తేలిచుగా అపనమ్మికచే అనుమానపడువారు. దానికి కారణముకాకుము. మఱియు కలహములుపెట్టువారి దుర్భోధనలకు వశ్యురాలవైన భర్తలు ప్రమాదకరమైనద్రోహముగానెంచుచో ప్రాణహత్యనుగూడ చేయుదురు. (5) బిడ్డలపై వారితండ్రి న్యాయముగా శిక్షవిధించిన కోపింపకుము. పెక్కుతల్లులు తండ్రి విధించు శిక్ష యన్యాయమనియు, కఠినమనియు దలచెదరు. అనవసరముగ అడ్డుపడుట, అధికప్రసంగము ఈ దురభ్యాసము దాంపత్యానురాగమునకు గూడ ప్రతికూలముకాగలదు. (6) నీపుట్టినింటిలో తల్లిదండ్రులయొద్ద చాల దినములు గడుపకుము. అటులయినచో నీగృహకృత్యములు సమాళించుకొనుటకును, పతిసేవచేయుటకును ఎక్కువ అవకాశము దొరకదు. (7) ఇంటిపనులు జరిపించుటయందు ఇరుగుపొరుగువారి సలహాల నంగీకరింపకుము. గృహకృత్యములన్నియు స్వబుద్ధినుపయోగించి సాధింపుము. తోచకున్న భర్తతో నాలోచింపుము. (8) నీభర్తను తృణీకరించి తిరస్కారముగా మాటలాడకుము. ప్రక్కనవినువారతనిస్వభావమిదియేయని భావించెదరు. నీదుడుకుమాటలచే పతిని గౌరవము తగ్గును. (9) చిరునవ్వు నవ్వుము. స్వల్పకార్యములందును శ్రద్ధకలిగియుండుము. స్నేహితురాలైన ప్రియకాంత తేలికగా నుత్సాహములేనిదయ్యె, అలక్ష్యము చేయు భార్యను స్థానభ్రష్టురాలుగా జేయును. (10) నేర్పుతో గార్యము సాధింపుము. స్త్రీలకుతగిన గుణములు పొందియుండుము. స్త్రీలయొక్క లక్షణములు పురుషులనాకర్షించును. స్త్రీ పురుషలక్షణములు వహించిన యెడల భర్తప్రీతిని గోల్పోవును.

ఈనిబంధనల నియమించిన పిదప విడాకులచట్టప్రయోగము తగ్గినదనియు, సంసారసంబంధమైన భార్యాభర్తల మనస్తాపముల కవకాశముండదనియు పైజెప్పబడిన సంఘమువారియనుభవము.

### బరోడా సంస్థానమున విడాకులచట్టము:—

జూనుమాసము 20–వ తేదీనాటి 'గోలకొండపత్రిక' ఇట్లు ప్రచురించుచున్నది:–

"బరోడామహారాజుగారు హిందూవిడాకులచట్టమున కంగీకారమొసగిరి. సంస్కారాదర్శకులగు మహారాజాగారు అగ్రజాతులలో వివాహితులు జీవితమెట్లు గడుపుచున్నారో విచారించుటకును, కష్టముల పాలైయున్నవారు విడాకులిచ్చుటకై అనుమతినిచ్చుటకును, సంస్థానమునందలి సుప్రసిద్ధస్త్రీపురుషులుగలసంఘమును నెలకొల్పిరి. ఈ సంఘమువారు బాగుగచర్చించి సూచనలుగావించిరి. ఇవి ప్రజాభిప్రాయము కనుగొనుటకై ప్రకటింపబడెను. సనాతనధర్మీయులలో దీనివలన అలజడికలిగెను. వారీశాసనమును ఆక్షేపించిరి. కాని సంఘసంస్కారులు ఆమోదించిరి. ఈశాసనమునసుసరించి వివాహమైన స్త్రీ లేక పురుషుడు తన భాగస్వామి ఏడు సంవత్సరములనుండి కనబడకున్నను, లేక మతాంతరుడైనను లేక సన్యాసియైనను, లేక క్రమముగ మూడు సంవత్సరములవరకు స్త్రీయేకాని పురుషుడేకాని కష్టపెట్టినను, లేక త్రాగుడుమున్నగు దురభ్యాసములకులోనైయున్నను, లేక ఇతర స్త్రీలో సంబంధముంచుకొనినను వివాహము రద్దుచేసికొనవచ్చును. ఇంతియకాక వివాహము జేసికొనినపుడు స్త్రీ లేక పురుషుడు తన భాగస్వామి వ్యాధిచే పీడింపబడుచున్నట్లును, లేక చెవిటి, మూగి, గ్రుడ్డి, పిచ్చియైయున్నట్లును, లేక అన్యమతమునకు చేర్చుకొనినట్లును, రుజువు పరచిన వివాహము రద్దుకాగలదు. ఈశాసనమునసుసరించి వివాహము రద్దుచేసినట్లు అజ్ఞనొసగిన ఆరునెలలకు పునర్వివాహము జేసికొనుటకు స్వాతంత్ర్యముండగలదు."



## ఒకేకాన్పున ముగ్గురుబిడ్డలు:—

వంగరాష్ట్రప్రభుత్వమువారికి వ్యవసాయశాఖాపరిశోధకుడగు శ్రీయుత యమ్. కార్బరీగారి భార్య మెయిన్‌పూరు వ్యవసాయప్రదర్శనస్థానమందిరమున ప్రసవించినది. ముగ్గురుబిడ్డలు పుట్టిరి. ముగ్గురును మగబిడ్డలే. ఇందు ఇరువురుబిడ్డలు చెరిఐదుపౌనుల తూకము, మూడవబిడ్డ నాలుగుపౌనులతూకము ఉండెను. మాతాశిశువులు కులాసగనున్నారు. ఇది ఆమెకు రెండవకాన్పు. తొలికాన్పున ఆమెకు ఒకఆడపిల్ల. ఆ ఆడపిల్లకు ఇప్పుడు మూడవసంవత్సరము.

## జంతువులకును దాంపత్యప్రేమగలదు:—

ఒకమగసింగము తుపాకిచే కాల్చబడిచచ్చిపడెను. దానిప్రక్కనేయున్న ఆడుసింగము అందులో దుఃఖవివశమయ్యెను. మగనిశవముపై సొగిలిపడెను. కాని వెంటనే అదిలేచినిలచెను. దాని శరీరమందలి ప్రతిరోమమును కోపముచే ఘూర్ణిల్లుచుండెను. తనమగనిని కాల్చినవేటకానిని అది పసిపట్టినది. ఆవేటకానిని వెన్నంటినది. అతడు తనక్యాంపునకుమనుండగా కంచెలదాటి అది వానిపైదుమికి వానిని తుదముట్టించినది. వెంటనే తిరుగుమొంగముపట్టి భర్తశవముదగ్గరకువచ్చి కన్నీరుకార్చుచు నిలచియుండినది. దక్షిణాఫ్రికా ఎడారియందు జరిగిన యీవిచిత్రవిషయమును స్వయముగచూచినఒకానొకరు నేటాలువిట్నెస్సు అనుపత్రికలో వ్రాసియున్నారు.

## జంతువులకును జ్ఞానముకలదు:—

ఒకమగసింగము, ఒకఆడుసింగము, వానికిశోరములురెండు ఒక ఏటి యిసుకతిన్నెమీద చెలగాట మాడుచుండెను. ఉన్నట్టుండి మగసింగము తలపైకెత్తెను. గాలిలో దానికేదో ఒకవార్తవచ్చెను. ఎత్తినతల ఎత్తినట్లేయుంచి అదిఒకసన్నని సాంకేతికధ్వనిని చేసెను. ఆడుసింగమును పిల్లలును తమనివాసస్థానపు మొంగము పట్టినవి. అవి స్వస్థానము సుఖముగ జేరినవని తోచినతోడనే మగసింహము తనకుపసివచ్చినవైపు పోదొడగెను. ఈ సింహములను గురిచూచికొట్టవలయునని పొంచియున్న తెల్లదొర ఆజంతువుల కుటుంబప్రేమను చూచి నివ్వెరపడి తుపాకిపేల్చకుండుటకు నిశ్చయించి నిలచియుండెను. అనిముషమున ఆసింగము తుప్పలనొత్తిగించుకుని అతనియెదుట తోకత్రిప్పుచు గర్జించుచునిలచెను. అదియాతనిమీద పడలేదు. ఆమానవుడు తనచూపును దాటిపోవునంతవరకు అదియచ్చటనే నిలచియుండెను. అనంతర మది తిరిగివచ్చి తనకుటుంబ వ్యక్తులను కలుసుకొనెను. ఇట్లని ఒకవిలేఖరి నేటాల్ విట్నెస్సుపత్రికలో వ్రాయుచున్నాడు.

### ఒక స్త్రీ మూడు దినములు ఎడతెగక ఈదుట:—

క్రీస్బర్‌లో కటారినా వెహులవాయునకన్య డెబ్బదిరెండుగంటల ఇరువదియొక్క నిమిషములకాలము అనగా దాదాపు మూడుదినములు నీటిలో ఈదినది. మార్చిమాసమున ఒకానొక ఈతపందెమున ఈమె ఇప్పటి కంటె పంద్రెండు నిముషములతక్కువకాలము ఈదికొట్టెను. ఈతయందలి తన నేర్పును ప్రదర్శించుటచేతనే ఈమె తనకుటుంబమును పోషించుకొనుచున్నది.

### హుగ్లీనదిని పద్ధిహేను నిమిషములలో ఈదిదాటిన స్త్రీ:—

శ్రీ ఎ. కె. హాజ బి. యె. బారెట్లాగారిభార్య నవనానియను నామె బారక్‌పురమునుండి భద్ర పరకు హుగ్లీనదిని ఈది దానిని పదిహేనునిమిషములలో ఉత్తరించినది. ఈ ఘనకార్యమునకు ఆమెనందరు అభినందించిరి.

### జంతువుల అన్యోన్య ప్రేమ:—

జోసాఫ్ డెల్మాంట్ తాను ఆఫ్రికాఅడవులయందుచూచిన క్రిందివిషయము పత్రికలకు పంపినాడు. 'నేను వేటాడుటకు ఒకచోట పొంచియుంటిని. లేడిజాతికిచెందిన ఒకానొక విచిత్రజంతువుతోకను మరి యొకజంతువుకఱచిపట్టుకొనియుండుట చూచితిని. ధ్వనిచేసితిని. ఆవిచిత్రజంతువు వేగముగ పరుగెత్తెను. అందుతో దానితోకను కఱచుకొనియున్న జంతువు జారిపోయినది. దానిని నేను పట్టుకొంటిని. దానికి కండ్లుపోయిఉన్నవి. నేను అప్పుడు ఆగ్రుడ్డిజంతువును వదలిపెట్టి దూరమున పొంచిచూచుచుంటిని. ఇంతలో పారిపోయిన విచిత్రజంతువు తనతోకనుండి జారిపోయిన జంతువును వెతుకుకొనుచువచ్చెను. అచ్చటనున్న గ్రుడ్డిజంతువునుచూచి దానిచెంతకుపోయి తోకఅందించెను. గ్రుడ్డిజంతువుతోకను ఒకటిరెండు పర్యాయ ములు వాసనచూచి కఱచిపట్టినది. అప్పుడవి నాప్రక్కగాపోయినవి. విచిత్రజంతువుతోకకొనను గ్రుడ్డి జంతువుచే కొఱికివేయబడుటచే కాబోలు వెంట్రుకలులేవు. ఇట్లాగ్రుడ్డిదాని నాజంతువు ఎంతకాలముగ వెంటత్రిప్పుచున్నదో?'

### పురుషుడు స్త్రీగా మారుట:—

కోపెన్‌హేగన్‌లో ఒకడేనిష్‌చిత్రకారుడు స్త్రీగామారెను. ఈమార్పును ఎల్లరంగీకరించిరి. వివాహపు రిజిష్టరులో కూడ నమోదుకాబడెను. అతనిపేరు ఇనార్ వెజినర్. జాత్యంతరమును పొందిన అతని వెనుకటి వివాహమురద్దుచేయబడినది. అతని వెనుకటిభార్య ఇంకను జీవించియున్నది.

### పదునాలుగవవత్సరమున నేప్రవేశపరీక్షలో జయమొందిన బాలిక:—

పాట్నానివాసి సేటు రామకృష్ణదాల్మియా గారి కూతురు రామాబాయిదాల్మియా కిప్పుడు 14 సంవ త్సరములవయస్సు. హిందూవిశ్వవిద్యాలయముయొక్క ప్రవేశపరీక్షయందు అందరికన్న ఉత్తమురాలుగా రెండవస్థానమున జయమందినది. ఈమె తనకు అయిదుసంవత్సరములున్నప్పుడే భగవద్గీతయంతయును కంఠతః అప్పగింప గలిగియుండెను.

### నూటపదునైదువత్సరములుజీవించిన స్త్రీ:—

ముష్షీగంజకిచెందిన దేవబాగులో శ్రీమతి వామసుందరదేవి నూటపదునైదుఏండ్లు జీవించి మర ణించినది. చనిపోవువఱకు నీమె చాలఆరోగ్యముగ నుండినది.

### సౌందర్యసంపాదనకొఱకు ప్రాణములు బలి:—

కెయిన్‌లో నివసించు ఒక పాశ్చాత్యసుందరి తన శిరోజములను ఉంగరములు చుట్టుకొనువానిగాచేసి సౌందర్యసంపాదన మొనర్చుటకు స్నానముచేయుచు విద్యుత్కిరణప్రసారముగల ఇనుపతీగలతో సవరింప నారంభించెను. ఆసందర్భమున విద్యుత్కిరణములు దేహమునకు తాకి ఆమెచనిపోయెను. సౌందర్యసంపాదన కొఱకు ఆమె తనప్రాణములను ఇట్లు బలివోయినది.




## పెళ్లామునకు గాయములు పెట్టినాడు: తాను పిచ్చి నభినయించుచున్నాడు:—

మెహర్ బీబి యనిఒక మహమ్మదీయవనిత. ప్రాణాపాయస్థితిలో ఆమెఇపుడు నాగపురమునందు మేయోఆస్పత్రియందున్నది. ఆమెకంఠమునందును అరచేతులయందును పెద్దపెద్దగాయములు ఉన్నవి. శరీరమంతయు కత్తినాట్లు, కముకుదెబ్బలుగలవు. ఇవిఅన్నియు ఆమెభర్త అబ్దులురసీదు ప్రసాదించినవి. అబ్దులురసీదును మెహర్ బీబియును ఏడుసంవత్సరములక్రితము పెండ్లియాడిరి. పెండ్లియైన మూడుమాసములకే అబ్దులురసీదు భార్యనబాదుట, బాధించుట మొదలుపెట్టెను. అచిరకాలముననే అతడు ఆమెను పుట్టినింటికితోలివేసెను. ఆమెపుట్టినింట అయిదువత్సరముల కాలము వెళ్లబుచ్చెను. ఈలోగా మనోవృత్తికై ఆమెఅబ్దులురసీదుపై దావాతెచ్చెను. దావాఇంకను విచారణలోనుండెను. అప్పుడాతడువచ్చి ఆమెను ఏలుకొనుటకు అంగీకరించెను. కాపురము ఫోక్తుఆగుటయే ఆమె ఆశయము కావున మెహర్ బీబి అబ్దులురసీదు వెంటవెళ్లెను. ఈసారిఆమె అతనితోసుమారు రెండువత్సరములుండెను. వెనుకటి మూడునెలల కాపురమునాటి ముసళ్లపండుగ ఇప్పుడును ఆమెకుతప్పలేదు. తిట్లు, కొట్లు ఆమెకు నిత్యబహుమానములు. ఈ రెండువత్సరములలోనామె ఒక్కసారియైన తల్లిదండ్రులను చూచుటకు అనుజ్ఞ ఈయబడలేదు. ఇతరబంధువులైనను వచ్చిఆమెను చూచుటకు వల్లనుపడదు. 'చంపెదను' అనువాక్యము అతడు తఱచుఉచ్చరించుచుండెను. ఒకనాటి ఉదయమున హఠాత్తుగ నాతడుమంగలికత్తితో నామెమీదికివచ్చెను. ఆకత్తితో నాతడు ఆమెకుప్రసాదించిన గాయములు ఆమెను ఆసుపత్రికిగొంపోయినవి. ఈరాక్షసకార్యమును నిర్వహించిన ఆమగడయ్యా ఇపుడు ఉన్మాదమును అభినయించుచున్నాడు.

## అన్నమునకు మొగము వాచి ఆత్మహత్య చేసికొన్న కోడలు:—

భవానిబాలదేవి. పదునాలుగుసంవత్సరములపడుచు. పదునైదుమాసములక్రితము ఆమెకు వివాహమయ్యెను. కొలదికాలమునకే ఆమెకాపురమునకువచ్చెను. మగడు కలకత్తాలోని కాళీప్రసాదదత్తువీథిలో 19-వ కవాటసంఖ్యగలయింట నివసించుచున్న పినతండ్రి, అతనిభార్యలతో నివసించుచుండెను. మగనితోబాటు భవానిబాలదేవియు ఆయింటనే యుండెను. పిన్నత్త ఆమెను పెట్టుబాధలకు పరిమితిలేదు. ఒక్కొక్కనాడామెకోడలికి కడమెతుకు ఆహారమైనను ఈయదు. ఇచ్చిననాడైనను ఆ ఆహారము రెండుడొక్కలు నిండునదికాదు. తలుచునిట్టుపాపములే. తప్పినచో అరాకలిమెతుకులు. కడుపులోకాళ్లుపెట్టుకొని ఆమె ఎన్నినాళ్లని జీవించగలదు? మేమాసము ఏడవతేదీని ఆమె కిరసనాయిలులో ముంచబడిన చీరనుధరించి నిప్పంటించుకొని నోటిఎంగిలిఉపవాసములతో చీపురుపుల్లయైయున్న తనశరీరమును కాల్చుకొనెను. నిత్యము క్షుధాగ్ని చేక్షుభితమగుచు బ్రతికియుండుటకంటె ఒక్కసారి ఈఅగ్నిలో పడిపోయి నశించుట మేలనుకొన్నదామె.

## మే

**20:**—శ్రీమతి కస్తూరిబాయి గాంధిగారిని సర్ మాల్కామ్ హెయిలీగారిభార్య ఆహ్వానించినది.

**21:**—ముదుసలియు బీదరాలును అగు నొక స్త్రీ ఇల్లువాకిళ్లులేని కాంగ్రెసు శాంతిసైనికుల కాశ్రయమిచ్చి అన్నపానములిచ్చిన విషయమువిని మహాత్ముడిట్లుచెప్పినాడు: 'గతవత్సరము గొప్ప ప్రబోధసమయమున స్త్రీలలో అనేకమంది వీరమాత లుదయించిరి. నిరాడంబరముగా వీరుగావించిన ప్రశస్తమైన దేశసేవను భారతీయులెప్పుడును తెలిసికొనజాలరు.'

**22:**—భారతదేశమువరకు చిరకాలముగా నపారమగు ప్రజాసేవనొనర్చి ఇప్పుడు అమెరికా దేశమునకు బోవుచున్న శ్రీమతి కజిన్సుసతిగారికి వీడ్కోలు నొసగుటకు పౌరసభ మదరాసు గోఖలేహాలులో శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారి అధ్యక్షతను జరిగెను.

**23:**—బర్మారాష్ట్రీయహిందూమహాసభ శ్రీమతి సరళాదేవిఛాదురాణిగారి అధ్యక్షతక్రింద సమావేశమయ్యెను.

**24:**—

**25:**—ఇటలీపరిపాలనమున స్త్రీలకు ప్రత్యేకస్థానమీయబడినది. ఫాసిస్టుపద్ధతులందు విశ్వాసముగలిగినట్టియు సంపూర్ణమగు నైతికధైర్యముతో కూడుకొన్నట్టియు ఇరువదిరెండవ సంవత్సరములకు పైబడిన స్త్రీలు ఫాసిస్టుసంఘములుగా ఏర్పాటు చేయబడుదురు.

**26:**—సత్యాగ్రహిస్త్రీలను జెయిలులో అవమానపరచెనని సార్జెంటు మెకాంజీపైని, కనిస్టేబు విహారిపైని తేబడినకేసు బొంబాయిప్రధానరాజధాని మేజస్ట్రీటు కొట్టివేసెను.

**27:**—కర్నాటకమహిళాసభ అయిదవసమావేశము హుంకేరియందు శ్రీమతి దుర్గాబాయి జోషిగారి (అకోలా) అధ్యక్షతను జరిగినది. శ్రీమతి రామాబాయికుల్లాలిగారు స్వాగతోపన్యాసము నొసంగిరి.

:—మదరాసు దక్షిణఇండియా బ్రహ్మసమాజభవనములందు జరిగిన వీరేశలింగవర్ధంతిసభలో శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవిగారు ఉపన్యసించిరి.

**28:**—శ్రీ అల్లాడి కృష్ణస్వామిఅయ్యాగారు అడ్వకేటుజనరలుగారి తల్లి మంగమ్మగారు 86 ఏండ్లవృద్ధురాలు మరణించెను.

:—కాకినాడ విదేశవస్త్రబహిష్కరణోద్యమములో పాల్గొని మిక్కిలి ఉత్సాహముతో పనిచేయుచుండిన పదునాలుగు వత్సరములబాల శ్రీమతి గొర్తి సూర్యకాంతమ్మగారు జ్వరమువలన మరణించిరి.

**29:**—రౌండుటేబిలుసభకు తమకు ఎక్కుడు ప్రాతినిధ్యమొసంగగోరుచు స్త్రీల రాయబారవర్గమువారు వైస్రాయిగారిని సందర్శించిమాట్లాడిరి.

**30:**—శ్రీమతి కాళంగి శేషమాంబగారు నంద్యాలలో స్త్రీలసభలో ఉపన్యసించిరి.

**31:**—మదరాసుస్త్రీలసంఘమువారు తిరువల్లిక్కేణిలో శ్రీపార్థసారథిస్వామి దేవాలయముచెంత జాతీయపతాకవందనోత్సవము జరిపిరి. శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయిగారు పతాకమును లేవనెత్తిరి.

## జూను

**1:**—శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు అరక్కోణముచేరిరి.

**2:**—రౌండుటేబిలుసభకు భారతనారీమణులను ప్రతినిధులుగా నియమించవలెనని అంతర్జాతీయబ్రిటీషు స్త్రీసంఘమువారు విల్లింగుడన్ ప్రభువునకు తంతినంపిరి.

:—ముత్తులక్ష్మిరెడ్డిగారి నాయకత్వమున నొక స్త్రీ రాయబారవర్గము మదరాసు ప్రధానమంత్రి దివానుబహదరు మునిస్వామినాయుడుగారినిదర్శించి లోకలుబోర్డులందు స్త్రీలకు తగినంతప్రాతినిధ్యమొసంగవలయునని కోరిరి.

**3:**—చెన్ననగర విదేశవస్త్రబహిష్కారసంఘమువారి యాజమాన్యమున చూళైయందు జరిగిన బహిరంగసభకు శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు అధ్యక్షతవహించిరి.

:—శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు సేలమునందు ఉపన్యసించిరి.

4:—సికింద్రాబాదులో శ్రీమతి సరోజినీదేవిగారు జవహరలాలుగారి గౌరవార్థము విందుచేసిరి.

5:—ముప్పదినాలగన తమిళరాష్ట్రీయసభలో శ్రీమతి ఆచంట రుక్మిణీలక్ష్మీపతిగారు జాతీయపతాకను ప్రతిష్ఠించిరి.

6:—లండనులో భారతమిత్రసంఘమువారు ట్రాఫల్గరుస్క్వేరులో నొక బహిరంగసభను జరిపిరి. అప్పుడచట జాతీయపతాకమును నెలకొల్పిరి. ఆసభలో నొకస్త్రీ తకిలీమీద నూలుపడికిచూపెట్టెను. సభ్యులందరు వాసక్తితో చూచిరి.

7:—బార్డోలిలో శ్రీమతి కస్తూరిబాయిగాంధిగారి అధ్యక్షతక్రింద బహిరంగసభ జరిగినది.

8:—శ్రీమతి మంత్రిప్రగడ బంగారమ్మగారు స్వదేశీప్రచారమునకు పాలూరుచేరిరి.

9.—

10:—

11:—బొంబాయి ఆజదుమైదానమున శ్రీమతి సరోజినీదేవిగారి అధ్యక్షతక్రింద జరిగిన బహిరంగసభలో జవహరలాలు నెహ్రూగారు ఉపన్యసించిరి.

12:—పాలకొల్లులో అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మగారు ఖద్దరుధారణను గూర్చి ఉపన్యసించిరి.

13:—

14:—

15:—శ్రీవిద్యాశేఖర అక్కిరాజు ఉమాకాన్తము పంతులుగారిభార్య శ్రీమతి వరలక్ష్మమ్మగారుమరణించిరి.

16:—

17:—శారదాచట్టమునకు వ్యతిరేకముగ విశాఖపట్టణమున శ్రీకొల్లూరి నూకయ్యగారి కుమారుడు వేంకటరత్నము సెట్టిగారు (కలపవర్తకుడు) తన 9 వత్సరముల కుమార్తెను 29-1-31 తేదిని అనకాపల్లి వాస్తవ్యులగు తాటికొండ జగ్గారావుగారికిచ్చి వివాహముచేసియుండిరి. శారదాచట్టము నతిక్రమించినందుకు వేంకటరత్నముగారికి 25 రూపాయిల జరిమానా విధింపబడెను.

18:—ఢిల్లీ రాష్ట్ర స్త్రీలసంఘమువారు శ్రీవిల్లింగ్డను ప్రభ్వికి విందుచేసిరి.

19:—హ్యాట్ఫీల్డు దగ్గర సిసిలీడ్ ఓబ్రియనుకన్యయు ఆమెతో విమానములో పయనముచేసిన ప్రయాణికురాలును వారెక్కిన విమానము బద్దలైమండిపోయి చనిపోయిరి. ఓబ్రియనుకన్య వైమానికురాలు ఐర్లండులో ప్రథమురాలుగ నున్నట్టియు మంచి ఆటగాండ్రగు సర్ టి మోతీ ఓబ్రియనుగారి కూతురు. స్త్రీని ప్రయాణికురాలినిగ దీసుకొని ఇంగ్లీషు చానలుగుండా విమానములో పోయిన స్త్రీలలో ఈయమ్మయే ప్రథమురాలు. 1928లో ఈమెకు వైమానికప్రమాదముచే కాలుపోయెను. అయినప్పటికిని పయనమును మరల ప్రారంభించుసాహసించినది.

## వ్యాసములు వ్రాయువారికి

గృహలక్ష్మికి వ్యాసములు వ్రాయువారు కొంచము మార్జనుపదలి కాగితమునకు ఒకతట్టునసే సిరాతో విడివిడి అక్షరములతో వ్రాయవలెను. పెన్సిలుతో వ్రాయబడినవియు కాగితమునకు రెండుప్రక్కల వ్రాయబడినవియునగు వ్యాసములు చేకొనబడవు. వ్యాసములను గూర్చి ప్రత్యుత్తరములు కోరువారు రిప్లయికార్డువ్రాయవలెను. వ్యాసములు వాపసుకోరువారు తపాలాబిళ్లలు పంపవలెను. వ్రాయు ప్రతిలేఖయందును తమ చిరునామా పూర్తిగ నిచ్చుచుండవలయును.

—సంపాదకుడు.

# గ్రంథపరిచయము

## మననేతపరిశ్రమ:—

గ్రంథకర్తలు శ్రీయుత భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు. ఫూల్‌స్కాప్ సైజున 62 పుటలు. గ్లేజు కాగితములు. పావనీముద్రాక్షరశాల, బందరు. 1931. ప్రచురణకర్త తల్లాప్రగడ రామారావు, రాబర్టుసన్ పేట, మచిలీపట్టణము. గ్రంథము వెల రు 0-4-0 అణాలు. ప్రచురణకర్తకు వ్రాయునది. మననేతపరిశ్రమ తొలుత ప్రపంచమునన్నిటను ఎట్లు మించెత్తినది, ఇప్పుడది ఎట్లు అధోగతినందియున్నది ఈగ్రంథమునచక్కగ వివరింపబడియున్నది. భారతదేశమునకు రాట్నమే ఎట్లు శరణ్యమోవివరింపబడినది. రష్‌బ్రూకువిలియమ్సు, సర్ బేసిల్ బ్లాకెట్, గెయికీ పండితుడు మొదలగువారి వాక్యములిందుదాహరింపబడినవి. ఖద్దరుశ్రేష్ఠత నిరూపింపబడినది.

## సావిత్రీపరిణయము:—

ఆదివెలమకులోద్భవుడును, గూఢవల్లిగోత్రపవిత్రుడును అగు కోకా సీతయ్యనాయుడు బి. ఏ. గారి కనిష్ఠపుత్రికయు, ఉమ్మడిసింగువంశసంజాతుడగు కృష్ణరాయసమాఖ్యార్ధాంగియునగు తాయారమ్మచే విరచింపబడిన నాటకము. ఆశుకవిశిఖామణి పోకల వేంకట నరసింహారావునాయునిచే సరిచూడబడినది. మద్రాసు ఆనందముద్రాణాలయమున 1930-వ సంవత్సరమున ముద్రితమై ప్రచురింపబడెను. క్రౌనుసైజున 46 పుటలు. గ్లేజుకాగితములు. వెల రు 0-4-0 అణాలు. జముని మెప్పించి ప్రాణేశుని యసువులగొనితెచ్చినట్టి పతివ్రతాశిరోమణి పవిత్రచరిత్ర మీనాటకమున ఈవిదుషీమణిచే ప్రస్తరింపబడినది. సందర్భోచితముగ పాటలు, పద్యములు చేర్పబడినవి.

## భారతవర్ష సంగ్రహచారిత్రము:—

శ్రీశృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీమఠీయ జగద్గురు శ్రీకల్యాణానందభారతీమాంతాచార్యస్వాముల వారిచేత రచియింపబడినది. స్వధర్మప్రకాశిని పత్రికనుండి పునర్ముద్రితము. గ్రంథప్రకాశకుడు కనుపర్తి మార్కండేయశర్మ. డెమ్మీ 64 పుటలు. గ్లేజుకాగితములు. వెల రు 0-8-0 అణాలు. 1931 ఏప్రియలు నెలలో ప్రకటితము. ద్వాపరయుగాంతమునందలి స్థితిగతులు, శూద్రసామ్రాజ్యము, కారవేలుని శాసనము, ఆంధ్రవంశము మొదలగు జిజ్ఞాసనురేపువిషయములెన్నో ఈగ్రంథమున గలవు. కలియుగప్రారంభము మొదలు మహమ్మదీయపరిపాలనకాలమువఱకు గల సుమారు నాలుగువేల సంవత్సరముల పరిమితంబగు మహాకాలము నందలి భారతవర్షచారిత్రము దిఙ్మాత్రప్రదర్శనముగ ఈగ్రంథమున నిరూపింపబడినది. చదువదగిన గ్రంథము.

## పల్లెటూరికథలు:—

సాంఘిక, రాజకీయ, చారిత్రక, ఆర్థిక, పారిశ్రామికములను గూర్చి మనదేశముతో పాటు వివిధ దేశముల చరిత్రలుసహా ప్రతిమూడునెలలకు ఒకపుస్తకము తెనుగున వాడుకభాషలో ముఖ్యముగా గ్రామప్రజలకుపకరించు గ్రంథముల ప్రచురించు నుద్దేశముతో ప్రారంభింపబడిన ప్రయోజనవిద్యాగ్రంథమాలలో ఇది తొలిపుష్పము. క్రౌనుసైజున 64 పుటలు. గ్లేజుకాగితములు. వెల రు. 0-4-0 అణాలు. మొదటికూర్పు మార్చి 1931. కాకినాడలోని కాకినాడముద్రాక్షరశాలలో ముద్రితము. శ్రీడాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారికి అంకితము. గ్రంథకర్త శనివారపు సుబ్బారావు. గ్రంథములు వలయువారు గ్రంథకర్తపేర పశ్చిమగోదావరి జిల్లా కొవ్వూరుకు వ్రాయునది. 1930-వ సంవత్సరమున సత్యాగ్రహోద్యమసందర్భమున కారాగారవాసము స్వీకరించి గ్రంథకర్త జయిలులో ఈకథలను వ్రాసెను. పల్లెటూరిజనుల సంఘజీవనమును ఈకథలు ప్రదర్శించు

చున్నవి. వారిలోపములను వెల్లడించుచున్నవి. ఈగ్రంథమునకు శ్రీమంగిపూడి పురుషోత్తమశర్మగారు పీఠిక వ్రాసియున్నారు. ఇందు శాస్త్రి, తగవు, సహవాసగాళ్లు, పెళ్లిసరకులు, కైకేయతు, సవారిబండి అను ఆఱు కథలుగలవు.

**ముకుందమాల:—**

ముకుందమాల కిది ఆంగ్లానువాదము. వచనమున వ్రాయబడినది. గ్రంథకర్త సబ్ రిజిస్ట్రారు కె. వెంకట రంగారావు బి.యె. చిత్తూరునందలి వి. జె. ప్రెస్సునముద్రింపబడి ప్రకటింపబడినది. చిన్నసైజున 8 పుటలు. తిరుపతి, తిరుమలై, తిరుచనూరునందలి దేవాలయములదగ్గర ఈగ్రంథప్రతులు దొరుకును.

**శ్రీశివసహస్రనామస్తోత్రం:—**

నామావళీసహితం. సంపాదకుడు జి.జె. కృష్ణశాస్త్రిగారు, హాలహార్విపోష్టు, బళ్లారిజిల్లా; ప్రొప్రయిటరు చంద్రమౌళీశ్వరముద్రాక్షరశాల, కర్నూలు. 1931-వ సంవత్సరమున ముద్రితము. చిన్నసైజు 60 పుటలు. పీచుకాగితములు. వెల రు 0-4-0 అణాలు.

**ఝూన్సీలక్ష్మీబాయి:—**

ఏకాంకనాటకము. ఎక్సెల్సియర్ ప్రెస్సున ముద్రితము. డెమ్మిసైజున 24 పుటలు. గ్లేజుకాగితములు. వెల తెలుపబడలేదు. గ్రంథకర్త శ్రీ బులుసు రామశోగరావుగారు. దొరుకుచోటు : 15-16 తణికాచలంపిళ్లెవీథి, ట్రిప్లికేను, మదరాసు. భారతవీరవారి ఝూన్సీలక్ష్మీబాయి వీరజీవితమిందుక్లుప్తముగ రూపకరూపమున ప్రదర్శింపబడినది. ఏడురంగములు. ఎడనెడపద్యములు గలవు. స్త్రీలు, బాలికలు చదువదగిన గ్రంథము.

**జడగంటలు:—**

పద్మనాయకగ్రంథమాలలో ద్వితీయకుసుమము. కవితాసమితి సభ్యులగు శ్రీ చెలికాని సత్యనారాయణగారు గ్రంథకర్తలు. విజయనగరమున శ్రీ వేదవ్యాసముద్రాక్షరశాలయందు ముద్రితము. క్రౌనుసైజున 78 పుటలు. గ్లేజుకాగితములు. వెల రు 0-8-0 అణాలు. శ్రీ రాజారావు వేంకటశ్వేతాచలపతి రామకృష్ణ రంగారావు బహద్దరు బొబ్బిలి సంస్థానాధీశుల ప్రత్యేకధనసహాయమున ఈగ్రంథము ముద్రింపబడినది. గ్రంథము గ్రంథకర్తగారి పితృదేవునకు అంకితమీయబడినది. జడగంటలు అను ఈగ్రంథమున రాధానందము, పుత్రస్వీకారము, పత్నీదానము అను మూడుకథలుగలవు. మూడుకథలయందును మనసంఘమును పాడుచేయుచున్న మూఢదురాచారములు విమర్శింపబడినవి. 'పత్నీదానము' అనుకథ విచిత్రముగనున్నది.

**రుక్మిణీకల్యాణము:—**

కథాగీతము. రచియించినవారు శ్రీమతులు కంచిపూడి వరసమ్మ, పాలంకి సీతమ్మగార్లు. పబ్లిషరు పంపెద్దు లక్ష్మయ్య, బుక్కుసెల్లరు, రాజమండ్రి. డెమ్మిసైజు. పీచుకాగితములు. 9 పుటలు. వెల రు 0-2-0 అణాలు. రాజమండ్రి లక్ష్మీప్రింటింగు వర్కుస్సులో 1931-వ సంవత్సరమున ముద్రితము. పోతరాజు భాగవతములోని రుక్మిణీపరిణయప్రస్తావనగల పద్యములు వలయుమార్పులతో కీర్తనలుగా కూర్పబడినవి. గానప్రియులగు స్త్రీ లాదరింతురుగాక!

**పరీక్షిత్తు:—**

గ్రంథకర్త పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు. పిఠాపురమునందలి శ్రీవిద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాలయందు 1931-వ సంవత్సరమున ముద్రితము. గ్లేజుకాగితములు. క్రౌనుసైజు. 128 పుటలు. వెల రు 0-12-0 అణాలు. దొరుకుచోటు; కౌండిన్యనిలయము; పిఠాపురము, తూర్పుగోదావరిజిల్లా. పురాణ

ములు, ఉపనిషత్తులు, వేదములు కూలంకషముగ పరిశోధించి వ్రాయబడిన పరీక్షిత్తు కథగల ఉత్తమగ్రంథము. ఈగ్రంథము చదువుట వలన బాలురకు భాషతోపాటు ప్రాచీనభారతసాంఘికచరిత్ర, మతాచారములు కూడ తెలియును. పురుటింటివర్ణనము, వివాహధర్మవర్ణనము, గోపూజావర్ణనము ప్రత్యేకప్రశంసనీయములుగ నున్నవి. గ్రంథమునందలి ప్రతిపుటయు కర్తగారి చిరపరిశోధనమును, విపులవిజ్ఞానమును దృష్టాంతీకరించుచున్నది. వేదవాఙ్మయమునందలి ఉత్తమపదములు కొన్ని ఇందువాడబడినవి. ప్రాచీనకవులపద్యములు ఎడనెడ ఉదాహరింపబడినవి. నేటిపెక్కు పుస్తకములవలెగాక ఇదిబాలుర కెంతయు విజ్ఞానదాయకమైయున్నది. ఇట్టి ఉత్తమగ్రంథము నాంధ్రులకు ప్రసాదించిన శ్రీ శాస్త్రిగారిని మిగులకొనియాడుచు విద్యాశాఖాధికారు లీగ్రంథమును ఉచితరీతిని ప్రోత్సహింపవలసినదిగ హెచ్చరించుచున్నాము.

## గౌరీ, తులసీ, సంతానగోపాలపూజలు:—

స్త్రీలకు అత్యావశ్యకమయిన ౧ గౌరీపూజా, ౨ తులసీపూజా, ౩ సంతానగోపాలపూజా అను గ్రంథత్రయమునకిది సంపుటీకరణము. ఇది ఉచితముగ పంపబడును. మీవిలాసమును తెలుపుచు కార్డుమాత్రము వ్రాయుడు. పోస్టేజినికూడ భరించి దీనినుచితముగ మీకుబంపుదురు. దొరకుచోటు: స్వధర్మప్రకాశిని, బృందావనం, కీలుపాకు, మదరాసు. ఉచితముగ లభించుచున్న ఈ ఉత్తమగ్రంథమును కోరి పడసి స్త్రీలు యథోచితలాభములను పడయుదురు గాకయనికోరెదము. స్వధర్మప్రకాశినీసంపాదకులగు శ్రీయుత కనుపర్తి మార్కండేయశర్మగారి ధర్మపత్ని కీర్తిశేషురాలు కనుపర్తి రామమ్మగారి యొక్క అభిప్రాయానుసారము ఈగ్రంథము అభిలషించెడు వారలకు ఉచితముగా నొసంగబడుచున్నది. గ్రంథమున కీ. శే. కనుపర్తి రామమ్మగారి ఛాయాచిత్రముగలదు. గ్రంథము ఫుల్‌స్కాప్ సైజున 30 పుటలు. గ్లేజుకాగితములు.

## ఉపవాసచికిత్స:—

ఇది ప్రకృతిగ్రంథమాలలో అయిదవపుస్తకము. బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ప్రెస్‌నందు ముద్రితము. మరళూరు ఆర్యమూర్తిచే వ్రాయబడినది. ప్రకాశకులు ప్రకృతికార్యాలయమువారు, బెజవాడ. గ్రంథము క్రౌనుసైజున 110 పుటలు. గ్లేజుకాగితములు. గ్రంథమూల్యము గ్రంథమాల శాశ్వతచందాదారులకు రు 0-14-0 అణాలు; ఇతరులకు రు 1-0-0. గ్రంథకర్తగారి ప్రియజననియగు మరళూరు నారణాంబ కంకితము చేయబడినది. పెక్కుగ్రంథములు పరిశోధించి వ్రాయబడిన దగుటచే ఉపవాసచికిత్సావిషయముల నెన్నిటినో ఈగ్రంథము వెల్లడించుచున్నది.

## శ్రీరామచంద్రశతకము:—

న్యాయదీపిక, రెడ్డిరాణి పత్రికలనుండి పునర్ముద్రితము. శ్రీ వేణుగోపాల భక్తలీలామృతలహరీగ్రంథనిలయములోని షష్టమపుష్పము. బాలబ్రహ్మచారి, సహజకవి అగు వెలగల సుబ్బారెడ్డి గ్రంథకర్త. ఈపుస్తకము వెలగల వెంకమ్మగారి ద్రవ్యసహాయమున ముద్రింపబడినది. డెమ్మీసైజు 52 పుటలు. పీచుకాగితములు. వెల రు 0-2-0 అణాలు. వలయువారు గ్రంథకర్తపేర మారుపేరుకు వ్రాయునది.

## పురాణపతివ్రతలు:—

గ్రంథకర్త సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు. చెన్నపురీ, నుంగంబాకం, జయం అండ్ కంపెనీవారు ప్రకటించిరి. 19[illegible]1. వెల రు 0-4-0. క్రౌనుసైజు. గ్లేజుకాగితములు 52 పుటలు. సేవ్యాదేవి, సుకళాదేవి అను ఇద్దరు పతివ్రతల చరిత్రలు. ఆనుషంగికముగ మఱికొందరును స్మరింపబడిరి. చక్కని శైలి. బాలికలకు పఠనార్హమైనది.

## స్వార్థత్యాగము:—

బళ్లారి శ్రీకృష్ణదేవరాయగ్రంథమాలలో ప్రథమపుష్పము. గ్రంథకర్త ఘూళీ కృష్ణమూర్తిగారు. క్రౌనుసైజు, పీచుకాగితములు; 82 పుటలు. వెల తెలుపబడలేదు. రాజపుత్రస్థానమునందలి మేవాడచరిత్రకు సంబంధించిన చిన్నచక్కని నవల. పితృభక్తి ఇందు బాగుగా ప్రదర్శింపబడినది. గ్రంథము దొరకుచోటు: భారతీభవనము, కౌలుబజారు, బళ్లారి.




**బరోడా మైసూరు రాష్ట్రములు: సంఘసంస్కారము:—**

మైసూరు, బరోడా హిందూసంస్థానములు రెండును సంఘసంస్కారవిషయమున ముందంజవేయుచు తోడిసంస్థానములకేగాక బ్రిటీషుఇండియాప్రభుత్వమునకుగూడ మార్గదర్శకములుగనున్నవి. సంస్థానశాసనసభవారి అంగీకారముద్రను బడసిన హిందూవివాహవిచ్ఛేదముల బిల్లుకు ఈనడుమ బరోడామహారాజా గైక్వారువారు తమ సమ్మతినిచ్చిరి. బిల్లు శాసనమైనది. విడాకులపద్ధతి సంస్థానమున ప్రవేశపెట్టుటకు గల ఆవశ్యకతనుగూర్చి పూరావిచారణము జరుపుటకు ప్రత్యేకము మహారాజావారిచే నియమింపబడిన సంఘము వారిసూచనలకు ఈశాసనము ప్రత్యక్షఫలము. ఈక్రొత్తశాసనము ప్రకారము వివాహమైన స్త్రీపురుషులు తమ పార్శ్వవర్తి తప్పిపోయి ఏడుసంవత్సరములవరకు కనిపించకుండిన గాని; మతాంతరమును పొందినగాని; సన్యసించినగాని; మూడుసంవత్సరములు నిరంతర దాష్ట్యమునకు పూనుకొన్నగాని; విసర్జించినగాని; మద్యపానవ్యభిచారాదిదుర్గుణములకు అలవడినగాని; వివాహకాలమునాటికి చెవుడు, మూగ, గ్రుడ్డి, మతిభ్రష్టత, మతభ్రష్టత, వయోహీనత మొదలగు దోషములున్నగాని; వివాహవిషయమున మోసముజరిగినగాని తమతమ వివాహమురద్దుచేసికొనవచ్చును. వివాహములు రద్దు అయినతిరువాతగాని; విడాకు ఈయబడిన తరువాతగాని ఆరుమాసములకు ఈశాసనము ప్రకారము స్త్రీ పునర్వివాహము గావించుకొనవచ్చును. ఇంతటి ముఖ్యశాసనమును మఱియొక విషయమునకు సంబంధించిన దానిని మైసూరుశాసనసభవారు మొన్నను ఆమోదించినారు. హిందూన్యాయమున స్త్రీల వారసత్వనిర్ణయవిషయికమైనదాశాసనము. దానిని గూర్చి హిందూపత్రిక ఇట్లు అభిప్రాయమిచ్చుచున్నది. "ఇది సంఘమును తారుమారుచేయుచట్టము మాత్రముకాదు. శాసనసభలోని సభ్యులాంద్రు దీనికి మొక్కవోని తమ ఆమోదమును తెలిపియుండుటచే మైసూరురాష్ట్రమందలి స్త్రీల వారసత్వవిషయమున ఇది చక్కనిన్యాయమును గలిగించున‌ని నమ్ముట కెడముగలుగుచున్నది. అగుట దివాను తన అంత్యోపన్యాసమున ఈవిషయమున హిందూదేశమున కంతటకును మైసూరు మార్గదర్శకత్వము వహించినందులకు గర్వించు

చున్నామని చెప్పిన వాక్యములకు మేమాశ్చర్యము నొందుటలేదు." స్వదేశసంస్థానములందిట్టి సముచితసంస్తవనీయసంస్కరణములు గొనిరాబడుచుండుటచే మేయమ్మ చెప్పు హిందూమతము సంస్కరణమునకు విముఖమైన దనువాక్యము ఆధారములేని ఆకాశపురాణమగుచున్నది. హిందూసంస్థానములు సంఘసంస్కరణవిషయములు పెక్కింటియందు ఇతరసంస్థానములకంటెను, బ్రిటీషుఇండియాకంటెను ముందంజవేయుచున్నవి.

**ఆధునిక స్త్రీరత్న దశకము :—**

న్యూయార్కునందలి మతప్రచారకసంఘమునకు చెందిన పూజ్యపాదులు జాను హెయిన్సు హోమ్సుగారు నేడుజీవించియున్న స్త్రీరత్నములలో పది ఉత్తమరత్నముల పట్టిక తయారుచేసినారు. ఇది వారిపట్టిక.

1. జేనుయాడమ్సు : అమెరికాయందలి సంఘసేవకురాలు. 'ప్లస్ ఫోర్సుజేను'అను నది ప్రజామోదము బడసిన ఈమెనామము.
2. అనిబిసెంటు : దివ్యజ్ఞానసమాజకురాలు. కృష్ణమూర్తియొక్క ఇష్టదేవత.
3. కేథరైను బ్రెష్కోవ్‌స్కి : రష్యాదేశవిప్లవమునకు తల్లి.
4. మాడమ్‌క్యూరీ : ఫ్రాంసుదేశమునందలి శాస్త్రకోవిదురాలు.
5. ఎమ్మాగోల్డుమ్యాన్ : అంతర్జాతీయప్రఖ్యాతినందిన కార్మికనాయకురాలు.
6. హెలెన్‌కెల్లర్ : చెవిటిగ్రుడ్డివారల ఉపాధ్యాయిని; గ్రంథకర్త్రి.
7. ఎడ్నా : సెయింటు విన్సెంటుమిల్లే. కవయిత్రి
8. సరోజినీనాయుడు : కవయిత్రి; హిందూజాతీయనాయకురాలు.
9. మార్గరెటుసేంజరు : గ్రంథకర్త్రి; సాంఘికశాస్త్రకోవిదురాలు.
10. సిగ్రిడ్‌అన్‌డెస్టు : నార్వేదేశపుగ్రంథకర్త్రి.

ఈ స్త్రీరత్నదశకములో ఇరువురు పరాధీనభారతదేశపౌరులగుట సంతోషకరవిషయము. ఆధునికపురుషశ్రేష్ఠదశకములో మహాత్మగాంధి, మహాకవిటాగూరు ఇద్దరు భారతపురుషులున్నట్లే ఆధునికస్త్రీరత్నదశకములో అనిబిసెంటు, సరోజినీదేవి ఇద్దరు భారతస్త్రీలున్నారు. ఇదిభారతీయులు గర్వింపదగిన విషయములలో నొకటి.

**కీ. శే. మెహర్బాయిదొరాబ్జి తాతాసతిగారు:—**

జూను 18-వ తేదీ రాత్రి ఒంటిగంటవేళ లండనులో ఒకనర్సింగుహోమునందు శ్రీమతి మెహర్బాయిదొరాబ్జి తాతాసతి పరమపదించినది. చనిపోవునరికి ఆమెకు ఏబది రెండువత్సరములు. మైసూరురాష్ట్రమున ఒకప్పుడు విద్యాశాఖాదికారిగానుండిన హార్మాన్‌జీ జహంగీరు బహాభాగారి కుమార్తె ఈమె. తీవ్రమైనరక్తహీనతవలన ఆమెతీసుకొనుచుండెను. వైద్యులసలహాపైని ఆమె భర్తతోకలసి ఏప్రియలు మూడవతేదీని ఇంగ్లాండునకు చేరెను. రథిన్‌లోని డఫ్‌హౌసులో చేరెను. అయినను ఉపయోగములేక పోయినది. మృత్యుదేవత

ఆమెను కబళించివైచినది. తాతాసతి 1879-వ సంవత్సరమున అక్టోబరుమాసమున జనన మొందెను. ఆమె బాగుగ చదువుకున్నది. విశాలహృదయముకలది. విద్యాసాంఘికవిషయములందు ఆమె చేసిన విశేషకృషి హిందూదేశజులకందఱకును ఎఱుకయే. బొంబాయి రాష్ట్రస్త్రీల సంఘాధ్యక్షత వహించి ఆమె తనకార్యనిర్వహణశక్తిని, దీక్షాపరత్వమును, ఉపజ్ఞామహితబుద్ధిని, ప్రదర్శించెను. వ్యాయామవిద్యాకృషియందు ఆమెకు అభిమానము మెండు. కావుననే ఆమె ప్రిన్సెస్ మేరివిక్టోరియా జింఖానావారి వ్యాయామశాఖాభివృద్ధికి మిక్కిలి పాటుబడెను. అంతమాత్రమున తుపాకులు పట్టుకుని స్త్రీలు సైనికులవలె కర్మకౌశప్రదర్శనముగావించుట ఆమెకు ఇష్టముకాదు. తనకు ఇష్టముకాని సంగతిని చచ్చుతెగవేసి బహిరంగముగ చాటుటకు ఆమె ఎప్పుడును ఎంతమాత్రమును వెనుదీసి ఎఱుగదు. జోరాష్ట్రియనుల విషయమున కూడ ఆమె ఎట్టి మొగమోటమును లేక సలహాల నిచ్చుచుండునది. స్త్రీలసాంఘికసంస్థయగు భగినీసమాజమున ఆమె సభ్యురాలు. పూనాయందలి స్త్రీలకళ్లాశాలనిర్మాణమున తాతాసతికి చాలబాధ్యతగలదు. ఇండియను రెడ్ క్రాసుసొసైటీయందుసభ్యురాలు. యుద్ధఋణమునకు సొమ్మువసూలు చేసి నప్పటి ఈమెచాకచక్యమునకు మెచ్చి ప్రభుత్వమువారు సి. బి. ఇ బిరుదమునిచ్చిరి. పెక్కుసంస్థల కామె ద్రవ్యసహాయము చేసినది. ఆమెచక్కగ ఉపన్యసింపగలదు. అతిబాల్యవివాహదురాచారనిర్మూలనము కొఱకు ఆమెసంస్థానాధీశ్వరుల భార్యలతో సంప్రదించి ప్రబలప్రయత్నముసాగించినది. స్వదేశీయుద్యమమున ఆమెకు మంచిఅభిమానము. టెన్నిసు ఆటయందు ఆమె నిరుపమానమైన చాకచక్యము గలిగియుండినది. వెస్టరన్ ఇండియా మిక్సెడ్ డబుల్సునందు ఆమెకు రెండుసారులు ఛాంపియనుషిప్ వచ్చినది. హిందూదేశమునందును, యూరపునందును టెన్నిసుటోర్నమెంటులయందు ఆమె పాల్గొనుచుండినది. 1929-వ సంవత్సరము మేమాసమున జినీవాయందు జరిగిన స్త్రీలఅంతర్జాతీయసమావేశమునకు ఆమె భారతదేశప్రతినిధురాలుగా పోయియుండినది. బీడీపరిశ్రమయందు పనిచేయుచున్న స్త్రీలకడగండ్ల నామె లోకమువారియెదుట బెట్టినది. భారతపారిశ్రామికచక్రవర్తియగు సర్ దొరాబ్ తాతాగారి భార్యయైనందుకు ఆమె తగినరీతినే ప్రవర్తించి దేశకళ్యాణమును కాంక్షించినది. భారతస్త్రీల సాంఘికవిద్యాభివృద్ధినిగూర్చి ఆమె సర్వవేళల తలపోయుచుండెను. గతవత్సరము బొంబాయిలో జరిగిన అఖిలభారతస్త్రీజనసభకు ఆహ్వానసంఘాధ్యక్షురాలుగానుండి ఆమె యొసంగిన ఉపన్యాసము ఆమెవిజ్ఞానమునకు నిక్షేపముద్రయై పలువురచే కొనియాడబడినది. భారతస్త్రీయుద్యమము ఇంకను ఒకకడకుచేరని ఈసమయముననే ఈయమ ఇహలోకమును వీడుట మనదురదృష్టము. ఈమెఆత్మ శాంతిధామమును చేరుగాక!

శ్రీ మ తి క జి న్సు స తి ని ర్గ మ న ము :—

పుట్టకచే ఐర్లాండుదేశమునకు జెందినది. కాని ఆమె పదునైదు వత్సరములుగ హిందూదేశమున నుండుచువచ్చినది. అయుండుట ఆమె ఇతర ఐరోపియనులవలె 'నన్ను

ముట్టుకోకు నామాలకాకి' అనురీతినిగాదు. భారతమహిళల సముద్ధరణమునకై ఆయమ చేసినసేవ నిరుపమానము. ఆమెకు మధురాసు పౌరులిచ్చిన వీడ్కోలు సన్మానసభకు అధ్యక్షతవహించి ఆమెను గూర్చి శ్రీమతి ఆచంట రుక్మిణిలక్ష్మీపతిగారిట్లుచెప్పిరి: "భారతరాజకీయస్వాతంత్ర్యపోరాటమునందు కజిన్సుసతి చాల ఉత్సాహముతో పాల్గొని, భారతస్వాతంత్ర్యమును తనస్వాతంత్ర్యముగ భావించెను. భారతీయులకంటెను గూడ అపరిమితోత్సాహముతో నామె గత సత్యాగ్రహోద్యమమునందు దుమికెను. సహజస్వాతంత్ర్యాభిలాషి యగు నామెకీస్వాతంత్ర్యపుపోరాటములును, కారాగారకష్టములును నూతనములు గావు. ఐరిషు స్వాతంత్ర్యోద్యమమునందును, అటుపిమ్మట ఆంగ్లదేశమునందలి స్త్రీలస్వాతంత్ర్యోద్యమమునందును, ఆమె కారాగారములకు జనియుంటుటచే నది యామెకు క్రొత్తగాదు. గత సంవత్సరమునుండియు నామె స్వయముగ నూలువడకుచు, పూర్తిగ కద్దరునే ధరించుచుంటుట, భారతీయులనేకులకు ఆదర్శనీయముగ నుండదగియున్నది. కజిన్సుసతిగారీదేశమునకు గావించిన సేవలన్నిటికంటెను భారతమహిళాప్రబోధమున కొనర్చిన సేవను ఎన్నటికిని మరువరాదు. కజిన్సుసతిగారు రాకపూర్వ మీదేశమందలి స్త్రీలలో నేమాత్రమును ప్రబోధమున్నటుల గన్పింపదు. ఆమెప్రేరణవలననే భారతమహిళామండలి యొకటి ఏర్పరుపబడెను. అప్పటినుండియు నామె భారతీయస్త్రీలయొక్క సాంఘికరాజకీయాభివృద్ధికి నిరంతరము పాటుబడుచున్నది." ఈభారతదేశహితైషిణి కిప్పుడు అమెరికాదేశమున ఉద్యోగమగుటచే నామె అక్కడికేగినది. అమెరికాదేశమునందున్నను భారతదేశమును ఆమె విస్మరింపదని ఆమె వెనుకటిచరిత్ర వెల్లడించుచున్నది. పైగా వీడ్కోలు సభలో ఆమె ఇట్లు ప్రకటించియున్నది: "నేనీదేశమున నేమైన పనిచేసినయెడల నది నాయాత్మసంతృప్తి కొరకును, నా ఈప్సితార్థసాధనకొరకును గావింపబడెనేగాని ఒకరి మెప్పును బడయుటకు గాదు. భారతజాతీయస్వాతంత్ర్యోద్యమమునందు పాల్గొనుభాగ్యమబ్బుట నాపూర్వజన్మ సుకృతము. ఐరిషుజాతిస్త్రీకి ఇంతకంటె గర్వింపదగిన విషయ మింకొకటియుండదు. విజ్ఞానమునందేమి, జాతీయాదర్శములందేమి, భావౌన్నత్యమునందేమి భారతదేశమునకును, ఐర్లండుదేశమునకును చాల సాదృశ్యముగలదు. భారతజాతీయస్వాతంత్ర్యోద్యమమును ఐర్లండుదేశమంతయు హృదయపూర్వకమగు సానుభూతితో పరికించుచున్నది. నేనును నాభర్తయు మొదట హిందూఆధ్యాత్మికవిజ్ఞానప్రభలచే నాకర్షింపబడి అనిబిసెంటుగారి ప్రోత్సాహమువలన నీదేశమున కరుదెంచితిమి. సుఖదుఃఖసంకులమగు నీమైహికజీవనము నుండి శాంతినాశించు మానవులకు హిందూవేదాంతమొక్కటే నిక్కువముగ శాంతినొసగగలదు. అట్టి శాంతినొసగగల దేశ మీప్రపంచమున మరియొకటిలేదు." భారతదేశమునుగూర్చి ఇంతటి గొప్పఅభిప్రాయముగల కజిన్సుసతి ఎప్పటికైన భారతదేశమును మఱువగలుగునా? ఆయమకు ఆయురారోగ్యములు, ఐశ్వర్యము నిండారునట్లు భారతులు ప్రార్థింతురుగాక!

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# గృహలక్ష్మి

## ఏజెంట్లు

తెనాలి: కొమ్మూమ్మరి కాశివిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివు ఆఫ్ న్యూస్
బళ్లారి: వి. రాజుమొదలియార్ & సన్సు, బ్రాహ్మణవీధి.
నెల్లూరు: ఎం. రామకృష్ణరావుగారు, 1256, ఎం. వి. అగ్రహారం.
బెజవాడ: న్గామల ఆంతోని.
మచిలీపట్టణము: కె. బాలకృష్ణ
జె.వి. ఆర్. శర్మ, న్యూస్ఏజెంటు
తిరుపతి: వై. వి. సుబ్బయ్య & కంపెని, వెంకటేశనివాస్
హైదరాబాదు: ఎస్. లక్ష్మీబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్తా మార్కెటురోడు,(మన ప్రాంతపు 1 రూ॥ఉస్మానియారూ 1-3-0అగును)
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
కొవ్వూరు: జి. వి. రామరావుగారు.
ఏలూరు: ఎస్. పి. ఆచార్లుగారు, పవర్ పేట.
రాజమండ్రి: ఎస్. బి.కృష్ణరావుగారు
తాడేపల్లిగూడెం: కాశీరాజు శ్రీరాములుగారు
బరంపురం: గోనియశెట్టిగారు, గొల్లపల్లి.
కొల్లూరు: కాజా సుబ్బయ్యగారు, బాలికాపాఠశాల.
గుంటూరు: విన్డ్సన్ కంపెని.
అమలాపురం: కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం.
పాలకొల్లు: వేమరాజు నరసింహంగారు, హెడ్మాస్టరు, మట్టపఱ్ఱు.
ఎలమంచిలి: మంత్రిప్రెగడ భావనారాయణగారు, కవితాసమితి.
కాకరపఱ్ఱు: కే. సత్యనారాయణగారు, సరస్వతీగ్రంథమాల.
విజయనగరం: కేసనపల్లి రామలింగంగారు, పొత్తూరివారి వీధి.
పిఠాపురం: మొం. వి. ఎస్. రావుగారు, కేశవకుటీరం.
విశాఖపట్టణం: అండే కృష్ణమూర్తి బ్రదర్సు.
జేమ్షెడ్పూరు. టి. వి. రమణయ్యగారు, 12 టేమరియా రోడు, న్యూ 'L' టౌను.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి", తపాలపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.

*

*  *

దశరథుఁడు:—ప్రాణప్రియా! కైకేయీ! ఇది యేమి? ఇదియేమి? నావలన నపరాధమేమైనఁ గలిగెనా? ఎందుల కీకోపము? నీకుఁ గ్రోధస్థానమైన కౌసల్య నిన్నేమైనఁ దూలనాడెనా? అయ్యో! మాటలాడవేమి? నీవు స్థిరమాభిమానధనవని యెఱిఁగియుండియే, నీవు పారతంత్ర్యదూరవని యెఱిఁగియుండియే, నీయెడ నివ్వరిముల్లంతయపచార మెవ్వరివలనఁ గలుగునోయని వేయికన్నులఁ గనిపెట్టుచు, నిన్ను సమస్తగౌరవపూర్వకముగ నాదరించుచు, నీనిరంతరానుగ్రహప్రాప్తికి వేయిదేవుల నారాధించుచు, నీఛాయవలె నిన్ను సర్వదా యాశ్రయించుచు, నాయభిమానము, నాప్రాణము, నాయాత్మ నీలోనుంచుకొని విధేయుఁడనై, నేను దినములు గడపుకొనుచుండఁగా నయ్యయ్యో! తిరిగి యిదియేమి? ఈ కోపమేమి? నాపాపమేమి? ఈదోషమేమి? నాదోషమేమి? ప్రాణనాయికా! పలుకవా? (కైకేయిపైఁ జేసాచి నిమురుచు) పరమవిధేయుండనైన నన్నిటులు చేయవలసినదని యాజ్ఞాపింపరాదా? నేను నీమాట కాదనాడుటకు సమర్థుఁడనా? ఇదిగో! ఇటుచూడు! అబ్బ! ఇటుచూడు! హరి హరీ! ఎంతకర్మము తటస్థించినది? ఆహా! ఏమిమాటలాడుచుంటివి! నీవడుగుటయు నేనంగీకరింపక పోవుటకూడనా? అటు లెప్పుడైన జరిగెనా? ఈతనువున జీవములుండఁగ నటులెన్నఁడైన సంభవించునా? ఎంతమాట! నీవర్థింపకుండనే నీచిత్తస్థములగు నభిలాషలను నీముఖలక్షణములఁబట్టియు, నీవాగ్వైఖరినిబట్టియు, నీపరిహారకులవలనఁ దెలిసికొనియు నేనింతదనుక నెఱవేర్చుచు నీపరిచర్యను జేయుచుంటినని నీవెఱుఁగవా? నీపరిచారికలెఱుఁగరా? నామనస్సాక్షి యెఱుఁగదా? లోకమెఱుఁగదా? పరిపాలించు భగవంతుఁడెఱుఁగఁడా? నేను నీకు సర్వదా వశుఁడనైతి ననుటకు నాదైన్యము ప్రబల నిదర్శనము కాదా? లోకోత్తరమైన నీసౌందర్యము ప్రబలతరమైన నిదర్శనముకాదా? ఓసివెఱ్ఱిదానా! ముసలిదశరథుని ముక్కుఁబట్టుకొని యిష్టానుసార మాడించు ముద్దులయిల్లాలెవతె యని యాబాలవృద్ధులలో నెవరినడిగిననైనఁ "గైకేయి, కైకేయి"యని వారేకగ్రీవముగఁ బలుకరా? అట్టిజనవాక్యమందులకుఁ బ్రబలతమనిదర్శనము కాదా? ఇంతయేల? నన్ను నారాజ్యమును శాసించునది నీవేకదా? అబ్బబ్బ! కైకేయీ! నన్ను క్షమింపుము. నీవడుగఁదలఁచినకోరిక నీకిచ్చుట కిష్టములేక నిన్నేమియు నేననలేదు. అనవసరవచోవ్యాసంగ మేల? ప్రస్తుతాంశమునకు రమ్ము.

సీ. చిదిమినఁ బాల్గాఱు చెక్కుటద్దములపై
 జిలిబిలిచిఱునవ్వు లొలయువాఁడు
కాళ్ళగజ్జెలు గల్లుగల్లుమనంగ నం
 దలికనుల్చల్లగాఁ దిరుగువాఁడు
బుడిబుడినుడువులఁ బూర్వభూపాలగా
 థల నేను గుడుచుచోఁ బలుకువాఁడు
రాఘవా! ముద్దీయరా యన్న నెగిరిగం
 తిడుచుహాయిగఁ గౌఁగిలించువాఁడు

గీ. నట్టిపదునాలుగేఁడులలోట్టె నెట్టు
లసురభీకరవనసీమ కంపువాఁడ
ననుచు నేడ్చితి నెప్పుడోయపుడు; మఱల
నిపుడు నీమూలమున నట్టు లేడ్చుచుంటి.

సీ. ఎవ్వానిఁదాపసి కీయ నేడ్చితి నని
 యింతదూర ముపన్యసించినావో
యెవ్వానిజననము యుద్ధమత్ప్రభుసౌఖ్య
 వననాటకమునకు నాందియయ్యె
నెవ్వానిపైమోహ మిట్టులు నన్నాఁడు
 దానికంటెను జాలవానిఁజేసె
నెవ్వానిమూఁపుపై నెగయనున్నది రేపు
 రఘువంశమహనీయరాజ్యలక్ష్మి

గీ. యెవనిచేతులవీఁడుగా నేను వెడలి
పోవుటకు వేయిదేవుళ్ళ మ్రొక్కుచుంటి
నట్టిరఘురాముతో నొట్టుఁబెట్టుకొందు
సరికదా! కోరు, సందేహసరణి మాని.

కైక—సరే చాలు! ఓత్రింశత్కోటిదేవతలారా! సూర్యచంద్రభగవానులారా! ఓపంచభూతములారా! దశదిక్కులారా! వింటిరా! వింటిరా! నాప్రాణనాథుని ఘోరప్రమాణము! మీరందఱందులకు సాక్షులు.

—పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులు.

# వరలక్ష్మీ స్తోత్రము

నమస్తే మహామాయే
శ్రీపీఠే సురపూజితే
శంఖచక్రగదాహస్తే
వరలక్ష్మీ నమోస్తుతే.
నమస్తే గరుడారూఢే
కోల్లాపురి భయంకరీ
కౌమారీ వైష్ణవీ బ్రాహ్మీ
వరలక్ష్మీ నమోస్తుతే.
సర్వదా సర్వవరదే
సర్వదురితనివారిణీ
సర్వైశ్వర్యప్రదం దేవీ
వరలక్ష్మీ నమోస్తుతే.
అక్షయంబీయతే దేవీ
ఆదిశక్తి మహేశ్వరీ
యోగినీ యోగిసంభూతే
వరలక్ష్మీ నమోస్తుతే.
పద్మాసనస్థితే దేవీ
పరబ్రహ్మపరాయణీ
పరమేశ్వరి మహామాయే
వరలక్ష్మీ నమోస్తుతే.
శ్వేతాంబరధరం దేవీ
నానాలంకారభూషణీ
జగస్థితు జగన్మాతే
వరలక్ష్మీ నమోస్తుతే.
సిద్ధిబుద్ధిప్రదే దేవీ
నిత్యభక్తి పరాయణీ
మంత్రసిద్ధికరం దేవీ
వరలక్ష్మీ నమోస్తుతే.